# ఆంధ్రపత్రిక



317245

The Andhra Patrika, Madras. Regd. No. M. 1118 Vol. 35 No. 234 SATURDAY 27th NOVEMBER 1948 వెల ఒకఅణా { Founder: K. Nageswara Rao

# 'కాశ్మీర్ పరిస్థితిని ప్రమాదకరం చేసే పనులేవీ చెయ్యవద్దు'

## ఇండియా పాకిస్థాన్లకు హితవు

### భద్రతా మండలిలో జఫ్రుల్లా ఖాన్ అసత్యారోపణలకు బాజ్పాయి సమాధానము

పారిస్, నవంబరు 25: కాశ్మీరు పరిస్థితిని మరింత తీవ్రపరచే పనులను గాని, రాజీకొరకు జరిగే సంప్రదింపులను చెడగొట్టే పనులనుగాని చేయరాదనీ, వెంటనే యుద్ధంవిరమింపవలెనని భద్రతా మండలి నేడు ఏకగ్రీవంగా ఇండియా పాకిస్థాన్‌లను కోరినది.

ఇదే మాదిరిగా కాశ్మీర్ మధ్యవర్తి సంఘం ఇదివరలో చేసిన యుద్ధవిరమణ విజ్ఞప్తిని మండలి పూర్తిగా సమర్థించినది.

కాశ్మీర్ చర్చలు నేడు ప్రారంభమైనప్పుడు శ్రీమతి విజయలక్ష్మీపండిట్ నాయకత్వాన భారత ప్రతినిధివర్గములోని అందరూ హాజరైనారు.

మధ్యవర్తిసంఘసభ్యుడైన కొలంబియా ప్రతినిధి ఆల్ఫ్రెడో లొజానో తమ సంఘము నిర్వర్తించిన కార్యముపై 11 పేజీల నివేదిక నొకదానిని మండలికి సమర్పించెను.

భారతఉపఖండములో ప్రవేశించగానే, అక్కడి పరిస్థితి తామనుకొన్న దాని కంటె భిన్నముగా నున్నదనీ, కాశ్మీరు యుద్ధములో పాకిస్తాను సేనలు కూడ పాల్గొనుచున్నవనీ ఆయన అన్నాడు. ...

## అఖిల రాజస్థాన్ స్థాపన

### ఉదయపూర్‌లో మీనన్ చర్చలు

ఉదయపూర్, నవంబరు 25: భారత ప్రభుత్వ సంస్థానశాఖ సలహాదారు వి. పి. మీనన్ నవంబరు 28 న ఉదయపూర్ వచ్చుచున్నారు. మీనన్‌గారు, అఖిల రాజస్థాన్ స్థాపన విషయమై రాజస్థాన్ యూనియన్ రాజ ప్రముఖ్‌తోను, రాజపుటానా ప్రాంత కమీషనరుతోను, రాజస్థాన్ యూనియన్‌లోని పరిపాలకులతోను యిక్కడ చర్చలు జరిపెదరని తెలియుచున్నది.

## అమెరికారేవు కార్మికుల సమ్మె పరిష్కారం

న్యూయార్కు, నవంబరు 25: అమెరికారేవు కార్మికుల సమ్మె పరిష్కారమైనది.

## భారతీయ ఔషధ నిర్మాణ శాస్త్ర సమితి

న్యూఢిల్లీ, నవంబరు 25: భారతీయ ఔషధనిర్మాణశాస్త్ర విజ్ఞానము సమీక్షించి సంపుటీకరించుటకూ, నిర్వహించుటకూ, 'భారతీయ ఔషధనిర్మాణశాస్త్ర సమితి' యనుపేర భారత ప్రభుత్వము ఒక ప్రత్యేక సంఘమును నెలకొలినది.

# హైద్రాబాదుపై భద్రతామండలి చర్చ:

# భారతప్రతినిధివర్గ నిర్గమనం

## కొలంబియా సభ్యుని కోరికపై

## చర్చ వాయిదా

పారిస్, నవంబరు 25: హైదరాబాదుపై చర్చలలో పాల్గొనుటకు తాను సిద్ధముగా లేనని నేడు ఐక్యరాజ్య భద్రతామండలిలో ఇండియా స్పష్టపరిచెను.

హైదరాబాదును ఇండియా ఆక్రమించుకున్నప్పటినుండీ అక్కడి పరిస్థితి మరింత చెడుచున్నదని పాకిస్థాన్ చేసిన ఆరోపణ నేడు చర్చకువచ్చినప్పుడు, కాశ్మీరు చర్చల నిమిత్తం మండలికి హాజరైన సర్ గిరిజా శంకర్ బాజ్పాయ్ తాము చర్చలలో పాల్గొనమనుటకు సూచనగా సభనుండి వెళ్లిపోయెను.

ఈ విషయమై శ్రీ విజయలక్ష్మీపండిట్ మండలి అధ్యక్షునికి స్వయంగా ఒకలేఖ వ్రాసినది కాని పరిస్థితిని అతడేమీ అర్థం చేసి కొన్నట్లగ పడలేదు. అందువలన ఆమె అతనిని సమీపించి "హైదరాబాదుచర్చలకు ఇండియా తన ప్రతినిధులలో ఎవరినీ నియోగింప సిద్ధంగా లేదని చెప్పినది.

అసలు పాకిస్థాన్ ఈ విషయమైమాట్లాడ వచ్చునా యని ఒక చిన్నసందేహముపై కొంతచర్చ జరిగినది. ఈ చర్చ జరిగేటప్పుడు పాకిస్థాన్ ప్రతినిధి అక్కడఉండ రాదని సిరియన్ ప్రతినిధి అన్నాడు.

చర్చను వాయిదావేయవలెనని కొలంబియన్ ప్రతినిధి మొదటిలోనే చేసిన ప్రతిపాదనపై ఓటింగు జరుపగా, అధికసంఖ్యాకులు సుఖముగా వాయిదా వేయుటకే ఇష్టపడిరి.

## టోజోను ఉరితీసేటప్పుడు

టోకియో, నవంబరు 25: జపాన్ మాజీ ప్రధానీ యుద్ధాపరాధి అయిన హిడెకీ టోజోను ఉరితీయునప్పుడు, జపాను దేశీయులెవరినీ హాజరు కానివ్వరు. ఐదుగురు అమెరికన్ అధికారులుమాత్రమే అక్కడ వుండెదరు.

## కొల్హాపురం సంస్థానం

### బొంబాయి రాష్ట్రంలో చేర్చుటకు మహారాజా సమ్మతి

కొల్హాపురం, నవంబరు 25: కొల్హాపురం సంస్థానమును బొంబయి రాష్ట్రంలో కలిపి వేయుటకు మహారాజా సమ్మతించినట్లు విశ్వసనీయముగ తెలిసినది. డిసెంబరు మొదటి పక్షంలో ఇది జరుగునని కూడ తెలిసినది. బొంబయి ప్రధాని బి. జి. ఖేర్ ఈ కార్యక్రమమునకు అధ్యక్షత వహించునని, సంస్థానముల మంత్రిత్వశాఖ రాజకీయ సలహాదారు వి. పి. మీనన్ కార్యక్రమమున పాల్గొనునని తెలిసినది. మహారాజా స్వంత వినియోగమునకు రూ 10 లక్షలు ఇచ్చెదరని కూడ తెలిసినది.

## అఖండజ్యోతి పర్యటన

న్యూఢిల్లీ, నవంబరు 25: స్వాతంత్ర్య చిహ్నమైన అఖండజ్యోతి, ఈప్రాంతాలనుండే తిరిగి ఇచ్చటనుండి తరలి పోవుచున్నది. ఢిల్లీనివిడుచుటకు పూర్వము ఈ అఖండము రాజ్ ఘాట్‌కు కొనిపోబడినది.

ఈ ఉత్సవము నేటి రాత్రికి ఢిల్లీకి చేరువలో నున్న ఒకపల్లెయందు మకాములో నుండి, రేపటి ప్రాతఃకాలమందు గుర్గాను కు తరలిపోగలదు.

ఈ అఖండజ్యోతి పరిష్కించి యున్న చిన్నరథమును కాంగ్రెసువారు లాగుచున్నారు.

## ఐర్ రిపబ్లిక్ చట్టము

### నెహ్రూ ప్రకటన

న్యూఢిల్లీ, నవంబరు 26: "ఐర్ (ఐర్లెండు)తో పౌరసత్వము హక్కులను, సదుపాయములను పరస్పరము యథాపూర్వముగా ఇచ్చి పుచ్చుకొనుటకు భారతదేశం సిద్ధముగ నున్నది" అని భారత ప్రధాని పండిత జవహర్లాలు నెహ్రూ నేడుదయం రాజ్యాంగపరిషత్తుకు తెలియజేసెను. ఐరిష్ శాసనసభ ఈ మధ్యచేసిన రిపబ్లికుచట్టము వలన ఏర్పడిన పరిస్థితిని పురస్కరించుకొని పండిట్ నెహ్రూ ఈ ప్రకటనచేయవలసివచ్చెను. ఐరిషు శాసనసభయందు ఆ దేశ ప్రధాని, బ్రిటిష్ పార్లమెంటునందు అట్లీచేసిన ప్రకటనలతో భారతప్రభుత్వం ఏకీభవించుచున్నదని పండిత నెహ్రూ తెలిపెను. "కామనువెల్తుతో భారతదేశ భవిష్యత్ సంబంధము ఎటులుండవలెనను సమస్య అత్యంత శ్రద్ధతో పరిశీలించుచున్నా"మని సభవారికి తెలియజేసెను. త్వరలోనే ఈ విషయమై సంతృప్తికరమైన పరిష్కారమార్గం సమకూడునని ఆశించుచున్నాను. ఐరిషు రిపబ్లికు చట్టము ఆమోదించుటవల్ల కలిగిన పరిస్థితిని గురించే మనము ఆలోచించవలసియున్నది. మనకు కూడ పరిసమాన హక్కులను సదుపాయములను ఇచ్చినట్లయిన, ఆ దేశీయులను పరాయివారిగ చూడమని స్పష్టీకరించుచున్నాను."

"భారత ఐర్‌ల మధ్య దీర్ఘకాలంగా మిత్రభావమేర్పడియున్నది. ఇదే భావము ... "

## సమితి అధ్యక్షునికి దాదూ అసమ్మతి

లండన్, నవంబరు 25: ట్రాన్సువాల్ భారత కాంగ్రెస్ అధ్యక్షుడు డా॥ యూసఫ్ దాదూ, పారిస్‌లో జరుగుచున్న ఐక్యరాజ్యసమితి సమావేశమునకు హాజరగుటకు గాను తనకు అనుమతి యివ్వ విషయంలో ప్రెంచి ప్రభుత్వం చేసిన విలంబనమునకు, ఐక్యరాజ్యసమితి అధ్యక్షుడు డా॥ హెర్బర్టు ఇవాట్‌నకు అసమ్మతి తెలియజేసెను. ఏ దేశములో నైనా ఐక్యరాజ్యసమితి ప్రతినిధులు సమావేశమగుచున్నప్పుడు, వారి ఎదుట ఒక సంఘం తరఫున తమ విషయమును చెప్పుకొనుటకు గాను వచ్చుచున్న ప్రతినిధిని రానివ్వకుండా ప్రతిబంధకం కలుగజేయు హక్కు ఆ దేశమునకున్నదా అని అడుగుచూ ఇవాట్‌కు కేబుల్ పంపినానని దాదూ నేడు చెప్పెను.

# రైల్వేఉద్యోగుల సమ్మె విషయమై ఓటుద్వారాయూనియన్లఅభిప్రాయం

## జనవరి 20 లోపుగా నిర్ణయము కావలెనని అఖిలభారత ఫెడరేషన్ సమావేశ తీర్మానం

నాగపూరు, నవంబరు 25: ఇచ్చట సమావేశమైన అఖిలభారత రైల్వే ఉద్యోగుల ఫెడరేషన్ సర్వసభ్య సమావేశము అనుబంధ సంఘములన్నియూ సమ్మె విషయమై తక్షణమే వోటు తీసుకొనవలెనని ఆదేశించుచూ నేడు అధిక మెజార్టీతో తీర్మానించెను. రైల్వే ఉద్యోగుల సంఘములన్నియు సమ్మె బ్యాలెట్‌ను త్వరలో పూర్తిచేసి, 1949 జనవరి 20-వ తేదీ లోపుగా ఫెడరేషన్ కార్యవర్గమునకు ఫలితమును అందజేయవలెనని కూడ ఈ తీర్మానము ఆజ్ఞాపించుచున్నది. జయప్రకాశ్ నారాయణగారు అధ్యక్షత వహించిరి. వివిధ యూనియన్లకు చెందిన 250 మంది ప్రతినిధులు ఈ సభకు హాజరైరి.

1949 జనవరి 1-వ తేదీని యావద్భారత ...

# 'సంస్థానములకు, రాష్ట్రములకు మధ్యవ్యత్యాసాలను రద్దుచేయాలి'

## రాజ్యాంగపరిషత్తులోని సంస్థాన ప్రతినిధులసభవారి కోరిక

న్యూఢిల్లీ, నవంబరు 25: రాజ్యాంగ పరిషత్తులోని భారత సంస్థానాల ప్రతినిధుల సభవారు నవంబరు 18 నుండి యిప్పటికి నాలుగుసార్లు సమావేశమై సంస్థానములకు, రాష్ట్రములకు మధ్యనున్న వ్యత్యాసములను పూర్తిగా రద్దు చేయవలసిందనీ, సంస్థానములకు, రాష్ట్రములకు ఒకే ప్రతిపత్తి ఉండవలెననీ, తీర్మానించిరి. ఈ విషయమును ఫలవంతం ...

ప్రతి రాష్ట్రప్రతిపత్తి మాదిరిగా ఒకటిగానే ఉండవలెనని సభవారు అభిప్రాయపడినారు. ఈ విషయమును ఫలవంతం చేయుటకుగాను, తగు చర్యలను ఎట్టి ఆలస్యం చేయకుండా వెంటనే తీసుకొనవలసిందిగా సభవారు సంస్థాన శాఖను కోరినారు. సంస్థానములను కూడ రాష్ట్రముల మాదిరిగానే పరిగణించినచో, రాజ్యాంగ ముసాయిదా మొదటి షెడ్యూలు ...

## జయప్రకాశ్ ఉద్బోధ

# మిగత చైనాతో సుఛౌ పూర్తిగా వేరైనట్లు కమ్యూనిస్టురేడియో ప్రకటన

## తూర్పు, పశ్చిమ, దక్షిణ దిశలనున్న అనేకప్రాంతములు తమ వశమైనవట

షాంఘై, నవంబరు 25: చైనా రాజధాని నాంకింగ్‌కు 200 మైళ్లు ఉత్తరముగావున్న సుఛౌ నగరమును కమ్యూనిస్టు సేనలు సంపూర్తిగా చుట్టుముట్టివేసినవనీ, బాహ్యప్రపంచముతో ఇది తన సంబంధమును పూర్తిగా కోల్పోయినదనీ కమ్యూనిస్టు రేడియో నేడు ప్రకటించెను.

సుఛౌ నగరమునకు తూర్పు, పశ్చిమ, దక్షిణదిశలనవున్న మొత్తం 28 జనపదములను కమ్యూనిస్టులు ఆక్రమించిరనీ, దక్షిణమున 100 మైళ్ళలోవున్న పెంగ్పూ-సుఛౌ నగరములను కలుపు రహదారి ఛేదింపబడినవనీకూడా ఇదే రేడియో ప్రకటన తెలుపుచున్నది.

కమ్యూనిస్టుసేనల అగ్ర భాగములో ఉత్తర చైనాలోని రెండు కీలకపట్టణములైన పీపింగుకు 20 మైళ్లలోనూ, టీంట్సినుకు 80 మైళ్లలోనూ నేడు పోరు సాగించుచున్నవి.

## శాసనసభాధ్యక్షుడికి చైనా ప్రధానిపదవి

నాన్‌కింగ్, నవంబరు 26: చైనా ప్రధాని వాంగ్ వెన్ హావ్ ఇటీవల రాజీనామా ఇచ్చుటచే, అతడి స్థానే చైనా శాసనసభ (యువాన్) అధ్యక్షుడిని ప్రధానిగా మార్షల్ చాంగ్ కై షేక్ నామినేటుచేసెను. ఈ నామినేషన్ శాసనసభామోదముకై నేడు దాఖలు కాగలదు.

## ప్రభుత్వ సేనాదళములు 14 సర్వనాశనం?

సుఛౌను పూర్తిగా చక్రబంధ వ్యూహములో పడవేసితిమని చెప్పుకొనుచు, ...

## అమెరికా సహాయ అవకాశము సన్నగిలినట్లే?

## ఇండొనీషియాకు తాత్కాలిక ప్రభుత్వం

(4-వ పేజీ చూడుము)

# విజయవాడ రేడియో స్టేషన్ ప్రారంభోత్సవసన్నాహములసమాప్తం

విజయవాడ, నవంబరు 24: ఆలిండియా రేడియో విజయవాడ కేంద్రమునకు డిసెంబరు 1 న ప్రారంభోత్సవం జరుగును. రాష్ట్రపతి డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్య, భారతప్రభుత్వ బ్రాడ్ కాస్టింగ్ శాఖమంత్రి సర్దార్ వల్లభభాయ్ పటేల్ గార్ల సందేశములు ఆరోజున అచ్చట నుండి ప్రసారముచేసెదరు. ప్రధాని ఓమందూరి పెదరామస్వామిరెడ్డిగారిని, ప్రారంభోత్సవమునకు ఆహ్వానించి, సందేశ మొసగ వలసినదిగ కోరడమైనది. రాష్ట్రమంత్రుల నందరినీ, ఆంధ్రదేశమందలి ప్రముఖులనూ ప్రారంభోత్సవమునకు ఆహ్వానించడమైనది.

రేడియోస్టేషన్ నిర్మాణం పూర్తి అయినది. నిర్మాణం యావత్తూ 15 రోజులలో అతి త్వరితముగ, జరిగినది. 357,15 మీటర్లపై, అనగా 840 కిలో సైకిల్సులో ఈ కేంద్ర ప్రసారములు వినవచ్చును. ఇవి ఆంధ్రదేశం అంతటా వినిపించు నను చున్నారు. మనదేశములో ఇతర కేంద్రముల నుండి, విదేశములలోని రేడియో కేంద్రములనుండి ప్రసారమగువాటిని రిలే చేయుటకు అవసరమగు యంత్రమును, ఎలెక్ట్రిక్ రికార్డింగు యంత్రమును ఏర్పాటు చేసిరి. యండమూరి సత్యనారాయణరావు, బాలగురుమూర్తిగార్లు ఈ కేంద్ర కార్యక్రమ శాఖ నిర్వాహకులుగ నున్నారు. ప్రస్తుతమునకు, గ్రామసుల కార్యక్రమములు, వారాంతపు పాటకచేరీలు చెన్నపట్నం కేంద్రంనుండి రిలే చేసెదరు. మిగతా కార్యక్రమము లన్నియు ఇచ్చటినుండే ప్రసారమగును.

## ఉపక్రమణదిన కార్యక్రమము

357.1 మీటర్ (840 కి. సై.)

1-12-1948

సాయంత్రం: 5-30 ఉపక్రమణిక. 5-31 భారత ఉపప్రధాన మంత్రి సర్దార్ వల్లభాయి పటేల్ సందేశము. 5-40 మద్రాసు ప్రధాని శ్రీ ఓమందూరు పెద రామస్వామి రెడ్డి ప్రసంగము. 5-50 మద్రాసు గవర్నరు సందేశము. 5-58 జనగణమన. 6-0 ఇంగ్లీషులో వార్తలు. 6-10 స్థానిక వార్తలు. 6-20 అంజలి—శ్రీమతి టంగుటూరి సూర్యకుమారి గానము. 6-30 శ్రీ దాలిపర్తి పిచ్చహరి—నాగస్వరము. 7-0 శ్రీ చిత్తూరు వి. నాగయ్య—"ఆంధ్ర ప్రశస్తి". 7-15 తెలుగులో వార్తలు. 7-30 ఆంధ్రదేశపు జానపదగీతాలు. సమర్పణ డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు, గాయకులు శ్రీమతులు కమలా చంద్రబాబు, వింజమూరి సీతా దేవి, వింజమూరి అనసూయా దేవి, శ్రీయుతులు ఘంటసాల వేంకటేశ్వరరావు, ఎం. ఎస్. రామారావు. 7-45 జాతీయ ఐక్యత—ప్రసంగము, డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్య. 8-0 శ్రీ ద్వారం వేంకటస్వామి నాయుడు - వయొలిన్, శ్రీ కోలంక వెంకటరాజు - మృదంగం. 8-30 శ్రీ పారుపల్లి రామకృష్ణయ్య పంతులు - గానం, శ్రీ నరిదే సుబ్బారావు - వయొలిన్, శ్రీ కె. హనుమంతరావు - మృదంగం. 9-0 ఇంగ్లీషులో వార్తలు. 9-15 వయొలిన్ త్రయం - జానపదగీతాలు, నిర్వహణ - శ్రీ ద్వారం వెంకటస్వామి నాయుడు. 9-30 "ఆంధ్రశ్రీ", యుగయుగముల ఆంధ్ర వైభవమును చిత్రించు చారిత్రక రూపకము, రచన: శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ, పాత్రధారులు: శ్రీమతులు ఎస్. వరలక్ష్మి, కమలా చంద్రబాబు, కొమ్మూరి పద్మావతీదేవి, శ్రీయుతులు సి. హెచ్. నారాయణరావు, ఘంటసాల వెంకటేశ్వరరావు. 10-0 కవి సమ్మేళనము, తెలుగుతల్లికి పుష్పాంజలి. ఆంధ్ర కవీశ్వరుల సమావేశము, శ్రీయుతులు విశ్వనాధ సత్యనారాయణ, కాటూరి వెంకటేశ్వరరావు, నాయని సుబ్బారావు, వేదుల సత్యనారాయణ శాస్త్రి, దేవులపల్లి కృష్ణ శాస్త్రి, తుమ్మలపల్లి సీతారామ మూర్తి చౌదరి, పుట్టపర్తి నారాయణాచార్యులు, జి. జాషువా, శ్రీరంగం శ్రీనివాసరావు. 11-0 ముగింపు.

# రాజ్యాంగ పరిషత్తులోని ఆంధ్రులకు హెచ్చరిక

## భా. ప్ర. రా. సమితి ఆంధ్ర శాఖ కార్యవర్గం తీర్మానాలు

విజయవాడ, నవంబరు 23: ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం విషయమై రాజ్యాంగ పరిషత్తు త్వరలోనే ఆంధ్రుల కనుకూలముగ పరిష్కరించునని భావించుచు, ఏ సందర్భములోనైనను ఆంధ్రరాష్ట్ర స్థాపనను యింకను వాయిదా వేయుటకు యత్నములు జరిగినచో, కనీసము రాజ్యాంగ పరిషత్తునందలి ఆంధ్ర సభ్యులైనను రాజ్యాంగ పరిషత్తునుండి తమ సభ్యత్వములకు రాజీనామా నిచ్చి తమ ధర్మమును నిర్వర్తించవలెనని కోరుచు మొన్న నిక్కడ జరిగిన భాషాప్రయుక్త రాష్ట్రసమితి ఆంధ్రశాఖ కార్యవర్గ సమావేశములో తీర్మానించిరి. తీర్మానము నకళ్లు రాజ్యాంగపరిషత్తునందలి ఆంధ్ర సభ్యులకు పంపించుటకు తీర్మానించిరి. సుబ్బరామయ్య సుబ్బారావుగారి అధ్యక్షతను జరిగిన ఈ సభకు పెనుమర్తి లక్ష్మీపతి శాస్త్రి, డాక్టరు. జి. రాజా, టి. రాధాకృష్ణమూర్తి, ఎన్. కాంభోట్లు, పానుగంటి వెంకటనాగభూషణం ఎన్. బాలా ర్కవర్ణేశ్వరి గార్లు హాజరైరి.

గంజాం, కోరాపుట్టి జిల్లాలలో శాఖా సమితులు ఏర్పరచుటకు గాడె నారాయణమూర్తి (బరంపురం)గారిని సమావేశకర్తగా ఎన్నుకోవడమైనది. జిల్లా సమితులను ఏర్పాటుచేయుటకు గడువు డిసెంబరు 31 వరకు పొడిగించడమైనది. రాయలసీమ మహాజనసభవారు చేసిన తీర్మానములను సంపూర్ణముగా బలపరచుచు, రాయలసీమ ఆర్థికాభివృద్ధికై కావలసిన పదికోట్ల రూపాయలను ప్రభుత్వమువారు రెవిన్యూ రిజర్వుఫండునుంచి వెంటనే ప్రత్యేకించి, రాయలసీమ ఆర్థికాభివృద్ధినిధి నేర్పరచి పి. వి. సుబ్బారావుగారి సిఫార్సులను కొనసాగించవలసినదిగా ప్రభుత్వమును కోరడమైనది.

భారత జాతీయ మహాసభకు అధ్యక్షులుగా ఎన్నుకోబడిన శ్రీయుత డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యపంతులుగారి 69వ జన్మదినోత్సవ సందర్భమున యీ సభవారు తమ హృదయపూర్వక అభినందనలను అందజేయుచు, వీరికి పెక్కు శత వత్సరములు ఆయురారోగ్యైశ్వర్యములు ప్రసాదించుగాక యని పరమేశ్వరుని ప్రార్థించుచున్నారు.

సర్ సి. వి. రామన్‌గారు యిటీవల బెంగుళూరులో భాషారాష్ట్రముల గురించి గావించిన ప్రసంగమును తీవ్రముగా ఖండించడమైనది.

# బందరులో బియ్యం అదృశ్యమగుట

## ధరల హెచ్చింపు ఫలితం

మచిలీపట్నం, నవంబరు 24: ప్రభుత్వం ధాన్యానికి బియ్యానికి ధరలు హెచ్చించుచు ప్రకటించిన వెంటనే, ధాన్యసేకరణాధికారులు మిల్లులవారివద్దా, టోకువర్తకుల వద్దా గల నిల్వలు లెక్కతీయ పూనుకొన్నారు. అందువల్ల చిల్లర వర్తకులవద్ద నిల్వ లేకుండాపోయి, ఏరోజుకారోజు బియ్యం కొనుక్కునేవారికి అవస్థ వచ్చిపడినది. జిల్లాకలెక్టరుగారికి, రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్లకు ఫిర్యాదులు వెళ్ళినవి. ప్రజలకు బియ్యం దొరకునట్లు చేయుటకు త్వరలో చర్యలు తీసికొనబడునని తెలియుచున్నది. ధరలు పెరుగుచున్నవని తెలియుటతోడనే కొన్ని కొట్లలోని బియ్యం నిల్వలు అదృశ్యమయినవట! (స్వ. వి.)

# మద్యనిషేధచట్టంకింద నేరములు శిక్షలు

### సాలూరు

నవంబరు 20: నగరి లక్ష్మీనారాయణ అను నతను వైపురంనుండి, కొండ తమ్మయ్య అను నతను కర్రివలస గ్రామంనుండి చెరొక సారా సీసా తెచ్చుకొనుచుండగా పోలీసులు అరెస్టు చేసిరి. వీరికి చెరొక రెండుమాసములశిక్ష విధింపబడెను.

### పాలకొల్లు

నవంబరు 20: మద్యనిషేధోద్యోగి బి. అప్పలస్వామి నాయుడుగారు ఇచ్చట కొన్ని స్థలములు సోదాచేసి, బ్రాంది ద్రాక్షారిష్టం, స్పిరిట్ సీసాలు, నల్లమందు కొంతవరకు పట్టుకొనిరి. 7 గురిని అరెస్టు చేసిరి.

# కొత్తటెలిఫోన్ల ఏర్పాటు

## మద్రాస్‌జిల్లా మేనేజర్ ప్రకటన

టెలిఫోన్స్ మద్రాసుజిల్లా మేనేజరు ఇలా ప్రకటిస్తున్నారు.

ఈ క్రింద తెల్పిన రిజిస్టర్లను శనివారములు తప్ప తక్కిన ఆఫీసు దినములలో సా. 3-5 గంటల మధ్య టెలిఫోన్ భవనాన చూచుకొనవచ్చునని ప్రజలకు ఇందుమూలముగా తెల్పడమైనది.

టెలిఫోను కనెక్షన్లకు దరఖాస్తుదార్ల లిస్టు, దరఖాస్తులు ఈ ఆఫీసుకు చేరిన తేదీలవారీ అమర్చినది.

రాయలసీమ విద్యార్థి మహాసభ ... నవంబరు 27, 28 తేదీలలో కర్నూలులో ... జరుగునని ... ప్రకటించెను.

పశ్చిమ గోదావరిజిల్లా జాతీయ విద్యార్థి మహాసభ ... 28 న జరుగనని ... సంయుక్తకార్యదర్శి ... వ్రాసెను.

# బస్సులలో అదనపు ప్రయాణీకులు

## పర్మిట్ నియమాతిక్రమణ గాదని హైకోర్టు తీర్పు

మదరాసు, నవంబర్ 23: మదరాసు నుండి పలయాడు మధ్య నడుస్తూవుండిన గాండివన్ బస్సుసర్వీసుకు చెందిన నొక బస్సులో ప్రయాణీకుల గరిష్ఠ సంఖ్యకంటె అదనముగా ప్రయాణీకులను ఎక్కించినారనే కారణమున ఏప్రిల్ 2వ తేదీ చెంగల్పట్టు రిజనల్ ట్రాన్సుపోర్టు అధికారి యం. డి. హెచ్. 843 నెంబరు బస్సు పర్మిట్‌ను రద్దు చేసెను. కంపెనీ వారు సెంట్రల్ రోడ్ ట్రాఫిక్ బోర్డుకు అపీలుచేయగా వారు పై ఉత్తరువు మారుస్తూ పర్మిటును 6 నెలలదాకా సస్పెండు చేసిరి. ఆ ఉత్తరువుపై కంపెనీ వారు హైకోర్టులో పిటీషను దాఖలు చేయగా ప్రధాన న్యా॥ రాజమన్నార్, న్యా॥ యస్. సోమసుందరంగార్లు బస్సు పర్మిటులో ప్రయాణీకులసంఖ్య మొదలగు నియమాలు నిర్ణయింపబడి యున్నప్పటికిని బస్సులో గరిష్ఠ ప్రయాణీకులసంఖ్య కంటే ఎక్కువమందిని ఎక్కించుట పర్మిటు నియమాల నుల్లంఘించడం కానేరదని, అట్టి నేరమునకు పర్మిటును సస్పెండుచేయుట తగదని తీర్పుచెప్పి ట్రాన్సుపోర్టుబోర్డు ఉత్తరువును రద్దు చేసిరి.

# శిశుహత్యానేరంలో ముద్దాయి విడుదల

చెన్నపట్నం, నవంబర్ 24: యం. యస్. యూసఫ్ గత జూలై 8వ తేదీని తనభార్యమీద ఆగ్రహంతో తన 2 నెలల ఆడబిడ్డ నెత్తి మునిస్పాను నేలపై మోది, హత్య చేసెనని మదరాసు హైకోర్టు సెషన్సులో తేబడిన అభియోగంలో జూరీ ఏకగ్రీవముగా యిచ్చిన తీర్పుతో న్యా॥ కే. సుబ్బరావుగారు ముద్దాయిని విడుదలచేసిరి.

## మరుపిళ్ళచిట్టిగారి జన్మదినోత్సవం

విజయవాడ, నవంబరు 25: 'ఆంధ్రజ్యోతి' సర్దార్ మరుపిళ్ళ చిట్టిగారి 50వ జన్మదినోత్సవం నవంబరు 27 నుండి డిసెంబరు 5 వరకు పెద్ద ఎత్తున జరుగునని చల్లపల్లి రంగారావుగారు టెలిగ్రామిచ్చిరి. 27 మధ్యాహ్నం పెద్ద ఊరేగింపు అనంతరం కొత్తపేటచౌకులో వేముల కూర్మయ్యగారి అధ్యక్షతను బహిరంగ సభ జరుగును.

గౌ॥ శ్రీ వే. కూర్మయ్యగారు 27 తేదీ బెజవాడలో మరుపిళ్ల చిట్టిగారి 50వ జన్మ దినోత్సవమునకు అధ్యక్షత వహించి, 28 తేదీ. తిరిగి మదరాసు వత్తురు.

## గౌ॥ శ్రీ గోపాలరెడ్డి పర్యటన

చెన్నపట్నం, నవంబరు 25: ఆర్థిక మంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు నవంబరు 27 వ తేదీ ఉదయం 7 గంటలకు విమానంలో బయల్దేరి న్యూఢిల్లీకి వెళ్లెదరు.

## ఉద్యోగ వార్తలు

చెన్నపట్నం, నవంబర్ 25: జే. ఆర్. కెర్‌గారు సెలవునుండి రాగానే కడపజిల్లా మద్య నిషేధాధికారిగా యం. అబ్దుల్ కరీమ్ బదులుగా నియమింపబడిరి.

# పాకిస్తాన్ ప్రధానితో డా॥ ఘోష్ సంభాషణ

కలకత్తా, నవంబరు 23: "నేను పాకిస్తాను ప్రధానితో అత్యంత స్నేహ, సౌహార్ద పూరితమును నిష్కపటమును నగు చర్చలు జరిపితిని. ఇండియా పాకిస్తాన్ల మధ్య సన్నిహిత తరములైన బంధములు, మిత్రభావము ఉండవలసిన ఆవశ్యకతను పాకిస్తాను ప్రధాని ఉద్ఘాటించెను. ఇట్టి మిత్రభావ రాహిత్యము ఉభయదేశముల నాశమునకు కారణభూతమగునని ఆయన చెప్పెను." అని జస్సోర్‌లో పాకిస్తాను ప్రధానితో సంభాషించి తిరిగివచ్చిన కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యుడు డా॥ ప్రఫుల్ల చంద్రఘోష్ గారు చెప్పిరి.

## ముస్లిమేతరులకు పాకిస్తాన్ ప్రధాని హెచ్చరిక

జస్సోర్, నవంబరు 23: ఇండియా పాకిస్తాన్లు సుహృద్భావమున నున్నప్పుడే రెండు అధినివేశములు సుఖముగా నుండగలవని, అభివృద్ధి నొందగలవని యిచ్చట బహిరంగ సభలో ఉపన్యసించుచు పాకిస్తాన్ ప్రధాని లియాకత్ అలీ ఖానుగారు చెప్పిరి. పాకిస్తాను తమ దేశమని తలచువారు, ముస్లిములతో కలసి దానిని బలియమైన దేశముగా చేయగోరువారు పాకిస్తాను నుండి వెడలిపోవలసినక్కరలేదని ప్రధాని చెప్పుచు, పాకిస్తాను తమ దేశమని భావింపజాలని హిందువులు పాకిస్తానునుండి వెళ్లిపోవలెననిరి. (అ. ప్రె.)

ఆంధ్రరాష్ట్ర జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ మహాసభలు, డిసెంబరు 4, 5 లలో జరుగునని, మొదటు జరగే తేది ... తెలియపర్చబడునని గౌతులచ్చన్నగారు వ్రాసిరి.

# డా॥ పట్టాభి జన్మదినోత్సవం

### మచిలీపట్నం

నవంబరు 24: డా॥ భోగరాజుపట్టాభి సీతారామయ్య పంతులుగారి 69-వ జన్మదినోత్సవము నేడిచ్చట కాంగ్రెస్ సేవాదళంవారి ప్రభాత ఫేరీలతో ప్రారంభమయ్యెను. నగరమంతయు ఉత్సాహము ముప్పిరికొని యున్నది. ప్రభాత ఫేరీ అనంతరం చరఖా సంఘంవద్ద కోడాలి అంజనేయులుగారు పతాకప్రతిష్ఠ జరిపిరి. మహిళామండలివారు డాక్టరుగారి ఇంటి వద్ద సర్వారామంగా నూలువడికే కార్యక్రమం ఏర్పాటుచేసుకొనిరి. పురపాలక సంఘము నేడుదయం చైర్మన్ రాళ్లబండి అచ్యుత రామయ్యగారి అధ్యక్షతను సమావేశమై డాక్టరుగారిని అభినందించుచు, వారికి 'నగరిస్వేచ్ఛ' నొసగుచూ తీర్మానించెను. స్థానిక పత్రికారచయితల సంఘంవారు సమావేశమై డాక్టరుగారికి అభినందనలు పంపిరి.

సాయంత్రం డాక్టరుగారి ఛాయాపటం ఊరేగింపు, మునిసిపల్ పార్కులో రాళ్ళబండి అచ్యుతరామయ్యగారి అధ్యక్షతను పెద్ద బహిరంగసభ జరిగెను. కోలవెన్ను రామకోటీశ్వరరావుగారు ఉపన్యసించుచు ప్రస్తుత క్లిష్ట స్థితిగతులలో మన దేశమును సక్రమ మార్గమున నడిపించగల సమర్థుడు డాక్టరు పట్టాభిగారే ననిరి.

చిట్టా బాలకృష్ణశాస్త్రిగారు ఉపన్యసించుచు, డాక్టరు ఆశయమైన లౌకిక రాజ్యాంగం సిద్ధించిందని, అంతర బాహ్య విషయాలయందు కాంగ్రెస్ దృక్పథము డాక్టరుగారి దర్శకత్వమున తగువిధముగా మారునని ఆశించవచ్చుననిరి. గురజాడ రాఘవశర్మ, గుడిసేవ సుబ్బయ్యగార్లు పట్టాభిగారిని ప్రశంసించుచు ప్రసంగించిరి.

టౌనుహాలులో పెనుమర్తి లక్ష్మీపతి శాస్త్రిగారి అధ్యక్షతను ఒక బహిరంగసభ జరిగెను. చిన్నకోట వెంకటస్వామి, డాక్టర్ ఎస్. హనుమంతరావు, మంగళపల్లి రాజేశ్వరరావు, టి. రామచంద్రరావు, హరినాగభూషణం ప్రభృతులు పట్టాభిగారి జీవితవిశేషములు వివరించుచు ఉపన్యసించిరి. ఉపద్రష్ట సుబ్రహ్మణ్యశాస్త్రి (ఫిడేలు) ద్రోవ్యిడి హనుమంతరావు (మృదంగం) వారణాసి గోపాలం (కంజీర) గార్ల వాద్యగోష్ఠి, హరిసోదరుల పాటకచేరీకూడ జరిగెను.

మహిళామండలి, జాతీయ సేవాసమితి వారలు సభలు జరిపి పట్టాభిగారికి అభినందనలు అర్పించిరి.

పురపాలక సంఘంవారు నేడు ప్రత్యేక సమావేశం జరపి, పట్టాభిగారికి, 'నగర స్వేచ్ఛ' ప్రదానపత్రమును రజతకరండమునందుంచి సమర్పించుటకును, డాక్టరుగారి తైలవర్ణ చిత్రమును సంఘభవనములో ఆవిష్కరించుటకును నిశ్చయించి, ఇందుకు రూ. 800/-లు మంజూరు చేయుచు తీర్మానించిరి. పట్టాభిగారి కంచు విగ్రహమును మునిసిపల్ పార్కులో ప్రతిష్ఠించ నిశ్చయించి, అందుకు ఒక సంఘము ఏర్పాటుచేసిరి.

### చికాకోల్

నవంబర్ 24: డా॥ పట్టాభిగారి జన్మదినోత్సవం నేడిచ్చట 'ఉత్తరాంధ్ర' కార్యాలయంలో బొడ్డేపల్లి అప్పలస్వామిగారి అధ్యక్షతను జరుపబడినది. శ్రీపాద వెంకటేశ్వర్లు ప్రభృతులు పట్టాభిగారి ఘనతను గురించి ప్రసంగించిరి. పట్టాభిగారికి దీర్ఘాయురారోగ్యములు ప్రసాదించవలసినదిగ భగవంతుని ప్రార్థించుచు సభ్యులు యావన్మందీ కొలదినిమిషములు మౌనముగ నిలబడిరి.

## రామలింగారెడ్డిగారి సందేశం

విజయవాడలో పట్టాభిగారి జన్మదినోత్సవములు జరుపుట కేర్పడిన సంఘమునకు పలువురు సందేశములు పంపిరి.

డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డిగారు పంపిన సందేశమిట్లున్నది: నూతన రాష్ట్రపతి డాక్టర్ పట్టాభి 69-వ జన్మదినోత్సవ నిర్వహణములో నేను కూడ హృదయపూర్వకముగ పాల్గొనుచున్నాను. మనదేశ చరిత్రలో ఆయన బహుముఖమ ప్రాధాన్యముగల పాత్ర నిర్వహించెను. ప్రసిద్ధిపొందిన రచయిత. అర్థశాస్త్ర నిర్వహణమునందు, స్వతంత్ర ప్రజ్ఞలోను చెప్పదగినవాడు. స్వాతంత్ర్యము కొరకు అకుంఠిత దీక్షతో సేవచేసిన దేశభక్తుడు. సంస్థాన ప్రజల స్వాతంత్ర్యమునకై పట్టుదలతో కృషిచేసి, పాతకాలమునాటి నిరంకుశ పరిపాలనమునుండి, ప్రజా పీడనమునుండి వారికి విమోచన కలిగించినవాడు. ఆయన నాకు చిరకాల మిత్రుడు. 'ఆయనతో విజ్ఞాన ప్రపంచములో సన్నిహిత సంబంధము ఏర్పడుట అపూర్వమైన జ్ఞాన ప్రబోధము. ఈ శుభ సమయమున ఆయనకు మన హృదయపూర్వక అభినందనములను సమర్పించెదముగాక.

### వ. వెం. గిరిగారు

సింహళంలో భారత హైకమీషనరుగానున్న వరాహగిరి వెంకటగిరిగారు ... ఈ క్రింది సందేశమంపిరి: యావద్భారతదేశమునకు అత్యంత ప్రేమపాత్రుడు, ఉత్కృష్ట దేశభక్తుడు డాక్టరు పట్టాభి. అట్టి మహాపురుషుడు ఆంధ్రులలో నొకడై యుండుట ఆంధ్రుల మహాభాగ్యము. ఆయన దేశమునకై తన సర్వశక్తులను వినియోగించెను. గాంధి మహాత్ముని ప్రియ శిష్యవర్గములోనివాడాయన. సంస్థాన ప్రజల ఉద్యమమును చేపట్టి మనోరథసిద్ధి పొందెను.

### విజయనగరం

నవంబరు 24: రాష్ట్రపతి డా॥ పట్టాభిగారి జన్మదినోత్సవ సభ నేడు ఉదయం శ్రీరామా ఆదిఆంధ్రస్కూలు హాలులో గోళాత్మమ్మయ్యనాయుడు, గారి అధ్యక్షతను జరిగెను. డా॥ పట్టాభిగారు, సంస్థాన ప్రజలకు, దేశానికి చేసిన మహత్తరసేవను గురించి ఏ. ఆదిరామమూర్తి, జి. ఏ. స్వామి, నేతల అప్పలస్వామిగార్లు మాట్లాడిరి. పిదప పట్టాభిగారు, రాష్ట్రపతిగా, కాంగ్రెసుకు, దేశానికి చిరకాలం సేవచేయుటానికై చిరత రాయురారోగ్యసౌభాగ్యములచే వర్ధిల్లవలసిందిగా భగవంతుని ప్రార్థిస్తూ తీర్మానము చేయబడెను. సాయంకాలం హరిజనవాడ రామమందిరంలో ఏ. ఏ. ఆర్. మూర్తిగారు పట్టాభిగారి చిత్రపటం ఆవిష్కరించిరి. మూర్తిగారు పట్టాభిగారిని గురించి ఉపన్యసించుచు గాంధీజీ తర్వాత, రైతు, వ్యవసాయ, పారిశ్రామిక కూలీలకు, అందులోనూ హరిజనులకు కన్నతండ్రి పట్టాభిగారే నని, 35 ఏండ్ల క్రితమే ఒక హరిజన బాలికను పెంచుకొన్న హరిజనోద్ధారకుడాయనని చెప్పిరి.

పట్టణకాంగ్రెస్ అధ్యక్షులగు ఎన్. లక్ష్మీనరసయ్యగారి అధ్యక్షతను జరిగిన బహిరంగసభలో పి. వెంకటసుబ్బారావు ప్రభృతులు పట్టాభిగారి జీవితవిశేషములను గురించి ఉపన్యసించిరి. జిల్లా కాంగ్రెస్ అధ్వర్యమున 24 గంటల నేత యజ్ఞము జరిగెను. 69 చిలపలనూలు రాష్ట్రపతికి పంపెదరు.

### చీరాల

నవంబరు 25: చీరాల పేరాల పౌరులతో కూడిన సంఘం ఆధ్వర్యమున డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారి జన్మదినోత్సవం నిన్న పేరాల స్వరాజ్య పార్కులో శ్రీ వేముల కూర్మయ్యగారి అధ్యక్షతను ఘనముగ జరిగెను. పట్టాభిగారి ఛాయా పటమునకు పూలమాలలు వేసి సభాస్థలియందుంచిరి. రావుల హరిప్రసాదరావు, మంత్రి కూర్మయ్య, బంటిన వెంకట్రావు, రెవరెండు బెంజిమిన్ గార్లు పట్టాభిగారి ధీశాలిత్వమును ప్రశంసించి వారికి ఆయురారోగ్య ఐశ్వర్యములు కలుగవలెనని ఆశించుచు ఉపన్యసించిరి.

చీరాలలో రామమందిరంవద్ద వీరబ్రహ్మంగారి అధ్యక్షతను జరిగిన సభలో నేటుకూరి ఉపేంద్రగుప్త, మద్ది సుబ్బారావు ప్రభృతులు పట్టాభిగారి గుణగణములు కీర్తించుచు ఉపన్యసించిరి.

### రేలంగి

నవంబరు 24: రాష్ట్రపతి పట్టాభి జన్మదినోత్సవం ఇచ్చట ఎస్. వి. వెంకట్రావుగారి అధ్యక్షతను జరిగెను. పి. వి. రత్నంగారు పట్టాభిగారి జీవితవిశేషములను వివరించిరి. పట్టాభికి ఆయురారోగ్యైశ్వర్యములు భగవంతుడు ఒసంగుగాకఅని ప్రార్థించిరి. శ్రీనరదా సర్వేశ్వర బాబు తేనీటి విందు చేసిరి.

### సాలూరు

నవంబరు 25: ఇచ్చట నిన్న సాయంకాలం కూ. వెంకటనారాయణగారి అధ్యక్షతను జరిగిన బహిరంగసభలో పట్టాభి సీతారామయ్యగారిని అభినందించుచు తీర్మానించిరి.

### విస్సాకోడేరు

నవంబరు 25: శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారి 69 జన్మదినోత్సవం నిన్న నిచ్చట శ్రీ రాపాక కనకరాజుగారి అధ్యక్షతను జరుపబడినది. 69 దీపాలు వెలిగించ బడినవి. పట్టాభిగారి చిత్రపటమును శ్రీ కలిదిండి సీతారామరాజుగారు ఆవిష్కరించిరి. పట్టాభిగారు దేశమునకు చేసిన సేవను గురించి ఉపన్యసించిరి. వారికి దీర్ఘాయురారోగ్యములను ప్రసాదించుగాక అని భగవంతుని ప్రార్థించిరి. సదస్యులకును, బాలబాలికలకును మిఠాయి పంచిపెట్టబడి జయజయ ధ్వానములతో అధ్యక్షుని వందన లముతో సభ సమాప్తినందినది

### చెన్నపురి లయోలా కాలేజి

డా॥ పట్టాభిగారి 69వ జన్మదినోత్సవ సందర్భములో లయోలా కాలేజి ఆంధ్ర విద్యార్థులు ఫాదర్ లూర్దుగారి అధ్యక్షతను సభ జరిపిరి. తేనీటి విందనంతరము ఎన్. జి. రంగాగారు డా॥ పట్టాభిగారు చదువుకొను రోజులలోనే జాతీయ కాంగ్రెసు వాలంటీర్‌గాచేరి, తదాదిగా ఏకదీక్షతో సేవచేస్తూ నేటికి భారత జాతీయ కాంగ్రెసు అధ్యక్షులైనారని, ప్రతివిద్యార్థి ఆదేశముగా జాతీయకాంగ్రెసుకు సేవ చేయవలసినదిగా ఉద్బోధించిరి. డా॥పట్టాభిగారి ఆయురారోగ్యాభివృద్ధి కోరుచు తీర్మానించబడెను.

# సమితి ఆహారకమిటీలో పాల్గొనవలెనని రష్యాకు ట్రూమన్ విజ్ఞప్తి

వాషింగ్టన్, నవంబరు 24: ఐక్యరాజ్య 'ఆహారవ్యవసాయిక సంఘము' యందు పాల్గొనవలయునని రష్యాకు ట్రూమన్ ప్రెసిడెంటు నేడొక విజ్ఞప్తి చేసియున్నాడు.

అధ్యక్షులుగా ఎన్నుకొనబడిన తరువాత, ప్రథమ దఫాగా, ఐక్యరాజ్యసమితి 'ఆహార - వ్యవసాయిక సంఘమునందు ప్రసంగించుచు అమెరికా అధ్యక్షులు ట్రూమన్ ఇట్లు పల్కిరి:

"వ్యవసాయి కాభివృద్ధి విషయమున రష్యాతో మనకుపమాకారంలభించినచక్కిన విభేదములను పరిష్కరించుకొనుటకు సమార్గము లేర్పడగలవు. పెక్కు తూర్పు యూరపు రాజ్యములు యీ సమావేశము నందు పాల్గొనుచుండుట ఆశాజనకముగానున్నది. ఈ ఆశ ఫలోన్ముఖము కాగలదని నమ్ముచున్నాను. సోవియట్ రాజ్యము లన్నియూ ఈ ఆహార సంఘమునందు సభ్యత్వము వహించగలవని ఆశించుచున్నాను. అర్జెంటైనావంటి వ్యవసాయ సంపదగల దేశము ఇందు సభ్యత్వము వహించుట సాకు ముదావహము కాగలదు.

తప్పక ఈ సంఘమునందు పాల్గొని సహకరించవలయునని రష్యాకు విజ్ఞప్తి చేయుచున్నాను.

"అంతర్జాతీయ గోధుమ ఒడంబడికను మనము, విజయవంతము చేయజాలకపోయినందుకు విచారించుచున్నాను. ఆ ప్రణాళికను పూర్తిచేసియుండిన, గోధుమ పంపకమునను, ధరవిషయమునందును, ప్రపంచమునందు కొంత స్థాయి యేర్పడుటకు అవకాశము గల్గెడిది. తిరిగి యేదైన సంప్రదింపులు జరిగి ఒక ప్రణాళిక తయారుచేయ బడగలదేని, దానిని నేను జనవరిలో జరుగనున్న నూతన కాంగ్రెస్ సమావేశమునందు మంజూరు చేయించుటకు ప్రయత్నింపగలను. గోధుమల విషయమున ఒక పద్ధతి విజయవంతము చేయబడగలదేని అదేవిధమయిన తక్కిన ఆహారధాన్యముల ప్రణాళికలుగూడ నిర్వహించుట కవకాశ మేర్పడగలదని నేను తలంచుచున్నాను. ఈసంఘముద్వారా, ప్రపంచమందల్ల ధాన్యోత్పత్తిలోనూ, ధరలలోనూ, యేర్పడిన అస్థిరత్వము తొలగింపబడగలదని ఆశించుచున్నాను, దీనిలో అంతర్జాతీయముగా యేర్పడిన ఈ ఒత్తిడి తగ్గుటకు వీలు కలుగును.

"మనమాదర్శముగా తలంచుచున్న ప్రపంచ ఆహారసమృద్ధి గల్గెనేని, వివిధ వాణిజ్యవిస్తరణలకు మార్గము లేర్పడును.

"సమృద్ధిగా ఆహారధాన్యములు అందుబాటులోనున్న వివిధదేశముల లోనూ, వాణిజ్య వ్యాప్తిని నిరోధించుటకు కృత్రిమముగా యేర్పరుపబడిన నిరోధము లన్నియూ తొలగగలవు."

# రామపాదసాగర్ ప్రాజక్టు

## "సాధ్యమా" అని తిరిగి విచారణ

### శ్రీ శొంఠి రామమూర్తిగారి రాయబార ఫలితం

మదరాసు, నవంబరు 25: రామపాదసాగరం ప్రాజక్టును కేంద్రప్రభుత్వంవారి ప్రయారిటీ నిర్ణయసంఘమునందు ఆమోదింపబడలేదని, మదరాసు ప్రభుత్వంవారి నివేదికలో చూపిన సందేహముల ననుసరించి కేంద్రప్రభుత్వంవారు తిరిగి యీ ప్రాజక్టు సాధ్యముకానా కాదా యను విషయం నిపుణుల విచారణకు పంపదలచిరని తెలియుచున్నది. ఈ సందర్భమున సర్ శొంఠి రామమూర్తిగారు ఢిల్లీ అధికారుల వద్దకు రాయబారం వెడలగా, రెండుమూడు నెలలలో యీ విచారణ ఫలితం తెలియగలదని చెప్పిరని యీ తెలియుచున్నది. శ్రీ రామమూర్తిగారు మొన్న సాయంకాలం మరలివచ్చిరి. వారిట్లు ప్రకటించుచున్నారు:—

నేను ఇండియా ప్రధానమంత్రిని, ఉపప్రధానిని ఆర్థికమంత్రిని యితర మంత్రులనుచూచి రామపాదసారమునకు కేంద్రప్రభుత్వంవారి ధనసహాయంగూర్చి చర్చించితిని. నా విన్నపములన్ని వారు సానుభూతితో విని అర్థంచేసుకొనిరి. ప్రపంచ నిపుణులను డా॥ శావేజి, (డాము నిర్మాణ నిపుణుడు) హార్బరు (అమెరికాలో అతి పెద్దదగు కేలిడాము నిర్మించిన ఇంజనీరు) ప్రొఫెసరు టెర్జాగి (హార్వర్డు విశ్వవిద్యాలయం మట్టిశాస్త్ర నిపుణుడు), సర్ మర్ఘభూక్తనలుగారు (ఈజిప్టులో అసౌను డాము నిర్మించిన కంపెనీ ఇంజనీరు), వీరంతా యీ స్కీము ఎంతకష్టమయినదయినా నిర్మాణ సాధ్యమయిందనుట నిస్సందేహమని అభిప్రాయం ప్రకటించియే యుండిరి. ఇపుడు మదరాసు ప్రభుత్వంవారు యిస్తున్న రోజువారీ లేఖనులో 800 కాలరీల శక్తియేయున్నది.

ఆహారధాన్యాల దిగుమతులకు కేంద్రప్రభుత్వమువారు సాలీనా రు. 110 కోట్లు ఖర్చు చేయుచుండగ, గోదావరియొక్క సంపద రామపాదసాగరంవంటి స్కీము ద్వారా వినియోగించక సముద్రంపాలు జేయుట గొప్ప నేరమగునని ఇండియా ప్రభుత్వంవారికి తెలిపితిని. ఇది మహోత్కృష్టమయిన కార్యంకనుక, యిది నిస్సందేహంగా ఆచరణ సాధ్యమైనదని రుజువు చేయుటకై వేరొకసారి నిపుణుల పరిశీలన చేయించాలని ఇండియా ప్రభుత్వంవారు నిశ్చయించిరి. అట్టి పరిశీలనానంతరం స్కీము ఆచరింపదగినదని నిర్ధారణ అయినచో, కేంద్ర ప్రభుత్వంవారు దీనికి మదుపు పెట్టెదరని నాకు నమ్మకం గలదు. నిర్మాణ సాధ్యమయినదనుచో దాన్ని కొనసాగించు టవసరమని ఢిల్లీవర్గాలవారు అంగీకరించిరి. ఇట్టి ప్రాజక్టు జయప్రదంగా కొనసాగించినచో ప్రపంచమంతలో ఇండియా గౌరవం పెంపొందగలదని స్మరించబడెను. తిరిగి పరిశీలన ఫలితం కొరకు వేచియున్నారు. కాలహరణం జరుగక ఈ పని పూర్తికాగలదని ఆశింపవచ్చును.

# ఇండొనీషియాలో డచ్చివారి ఉల్లంఘన

## రిపబ్లికన్ వాదన:

## సమితిసభ్యులలో ప్రచారము

బటేవియా, నవంబరు 25: రిపబ్లిక్‌తో రాయబారములు జరుపుటకు డచ్చిఅమాత్య రాయబారవర్గము ఇచ్చటచేరినదని వార్తలో పాటు, విదేశీ విలేఖరులెవరూ రిపబ్లికన్ భూభాగములోనికి పోరాదని డచ్చివారు ప్రకటించిన నిషేధాజ్ఞ కూడ ఒకేసారి వెలువడినది. ఇప్పటికి మూడు సంవత్సరములనుండి సాగుచున్న డచ్చి-ఇండొనీషియా వివాదదంపైరాయబారాలు ఇప్పుడు అతిప్రధానమైనఘట్టమున పడినవి.

డచ్చి వలస శాఖామంత్రి సి. జె. సాసెన్ ఈ అమాత్య రాయబారవర్గమునకు నాయకుడు. "డచ్చి సామ్రాజ్యమున స్వతంత్ర ఫెడరల్ ఇండొనీషియా సమాఖ్య" స్థాపనకు తమ రాయబారవర్గము ప్రయత్నించగలదని ఇతడు ప్రకటించుచున్నాడు. ఈ కార్యక్రమము వెంటనే ప్రారంభమై, ఇండొనీషియా ప్రజలు అధిక భాగమునకు గుర్తించగలదని కూడ ఇతడు చెప్పెను.

డచ్చి విదేశమంత్రి స్టిక్కర్, వలసమంత్రి సాసెన్, ఎర్. వి హోర్ గారలు ఈ రాయబారవర్గమున సభ్యులు. వీరు ఈశుక్రవారమునాడు రిపబ్లికన్ రాజధాని జోగ్జకర్తాకు విమానములో వెళ్లి రిపబ్లికన్ నాయకులతో చర్చలు ప్రారంభించెదరు. ఇండొనీషియా ఫెడరేషన్ వాదులైన ప్రముఖులతోనూ చర్చలు జరిపి, డచ్చి ప్రభుత్వమునకు చర్చల ఫలితమును నివేదించుటకు హాలెండుకు తిరిగి వచ్చెదరు.

బటేవియావిమానాశ్రయంవద్ద అమాత్య రాయబారులను భద్రతామండలి సామరస్య సంఘ ప్రతినిధులు కోర్కెస్ మొదలైనవారు కలుసుకొనిరి.

# పేరాల మార్కెట్‌వద్ద గాంధి విగ్రహం

## తొలగించాలని మునిసిపల్ కమీషనర్ నోటీసు

### ప్రజల ఆందోళన:

### మంత్రి చంద్రమౌళిగారికి విజ్ఞప్తి

చీరాల, నవంబరు 23: పేరాల మార్కెట్టువద్ద, బాపట్ల-చిన్నగంజాము రోడ్డు మార్జినులో ప్రతిష్ఠింపబడిన గాంధి విగ్రహమును వారంరోజులలోపల తొలగించవలసినదని, లేనియెడల తామే తొలగించి అందుకగు ఖర్చులు వసూలుచేసెదరని మద్రాసుజిల్లా మునిసిపాలిటీల చట్టం 182 (1) సెక్షనుక్రింద చీరాల మునిసిపల్ కమీషనరు ఆర్. గణపతిరావుగారు కొర్నెపాటి సీతారామయ్యగారికి నోటీసు జారీచేసిరి.

కొర్నెపాటి సీతారామయ్యగారు కమీషనరుగారికి బదులు వ్రాయుచు, ఆ విగ్రహ నిర్మాణము తమ వక్కరి స్వంత విషయముకాదని, గ్రామస్థులకు సంబంధించినదని అది రహదారికి అడ్డములేదుగాన అది ఆక్షేపణీయముకాదని గ్రామస్థులందరికి నోటీసులు పంపి వారి జవాబులు పొందవలసినదని తెలిపిరి.

భక్తిపూర్వకముగా నిల్పిన శ్రీ పూజ్య బాపూజీ విగ్రహము పడగొట్టించుట అధర్మమని, గ్రామములలో పలుచోట్ల యిట్టి విగ్రహ నిర్మాణములు జరిగెనని, వాటికేవేటికి ఆక్షేపణ రాలేదని, తమ కట్టడము రహదారికి అడ్డముగలేదని, అందువల్ల చీరాల కమీషనరుగారి నోటీసును రద్దుచేసి ఆ విగ్రహము అక్కడనే ఉండులాగున అనుమతించవలెనని, కోరుచూ పేరాల ప్రజలు స్వపరిపాలనశాఖామంత్రి శ్రీ కల్లూరి చంద్రమౌళిగారికిని గుంటూరు జిల్లా కలెక్టరుగారికిని విజ్ఞప్తులు పంపుకొనిరి. నకలు ఒంగోలు రివెన్యూడివిజనల్ ఆఫీసరుగారికి గూడ పంపిరి.

గుంటూరుజిల్లా కలెక్టరుగారు కొర్నెపాటి సీతారామయ్యగారికి, గాంధి విగ్రహముపై కప్పు కట్టడము ఆపివేసి ముందు మునిసిపల్ కమీషనరుగారివద్దనుండి లైసెన్సును పొందవలసినదని ఒక ఉత్తరువు పంపిరి. దాని ననుసరించి సీతారామయ్యగారు కమీషనరుగారికి ఈవారములో లైసెన్సుకు దరఖాస్తుచేసిరి. యింకను లైసెన్సు రాలేదు. ఒంగోలు డిప్యూటీ కలెక్టరు మిక్కిలినేని కోటయ్యగారు నిన్నవచ్చి ఆ విగ్రహ స్థలమును చూచి, విచారణ జరిపి వెళ్లిరి. గాంధిగారి విగ్రహము పైకప్పు నిర్మాణము నిలిచిపోయినది.

# ప్రజల పరస్పర విరుద్ధ కోర్కెలు

### మంత్రి కూర్మయ్యగారి హెచ్చరిక

చీరాల, నవంబరు 25: డాక్టరు పట్టాభిగారి జన్మదినోత్సవ సందర్భమున శ్రీ వేముల కూర్మయ్యగారు నిన్న నిచ్చటికి వచ్చినప్పుడు వివిధ సంఘములు వారికి స్వాగతపత్రములు సమర్పించి, పలు కోర్కెలు కోరిరి. మంత్రిగారు ఉపన్యసించుచు ప్రజలు పరస్పర విరుద్ధ కోరికలు కోరుచుండుటవల్ల ప్రభుత్వమునకు చాల చిక్కుగా వున్నదని, ఏ సమస్య పరిష్కారం కాకుంటున్నదని.

కూర్మయ్యగారు మొదట, అద్దంకి వెంకట్రావు, ఆర్. గణపతిరావు ప్రభృతులతో స్థానిక పోగాకు ఫాక్టరీ కార్మిక పాఠశాల, రామునగిరం ఎరుకలవాడ చూసిరి. ఎరుకలవాడలో పతాక మెగురవేయుచు ఎరుకలు తమ బిడ్డలకు చదువు చెప్పించుచో వలెనని, ఎల్లప్పుడు కాంగ్రెస్ జెండాకిందనే ఉండవలెనని హెచ్చరించిరి.

### గురిజాడ అప్పారావుగారి వర్ధంతి

విజయనగరం, నవంబరు 24: ఆంధ్ర సాహిత్యంలో ఒక నవయుగానికి సృష్టికర్తయైన మహాకవి శ్రీ గురజాడ అప్పారావుగారి వర్ధంత్యుత్సవం నవంబరు 30 నే ఆంధ్రులంతా జరపాలని ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘంవారు కోరుతున్నారు.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సేవాదళ బోర్డు ఆవసర సమావేశం డిసెంబరు 2 న చిలకలూరిపేటలో జరుగును.

ఆంధ్రరాష్ట్ర మహిళా సభ శ్రీ మతి కొండ పార్వతీదేవిగారి అధ్యక్షతను కాకినాడలో డిసెంబరు 4 న జరుగును.





Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press.
No. 7, Thambu Chetty Street, G T. Madras.